# పరిశోధన: నాడు, నేడు, రేపు

(అంతర్జాతీయ సదస్సు పత్రాలు)



సంపాదకులు

ఆచార్య మాడభూషి సంపత్ కుమార్

# విశాఖ ఏజన్సీ కోదు గిరిజనుల పండుగలు - ప్రాముఖ్యత

పెనుమాక రాజశేఖర్, ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం

**ఉపోద్ఘాతం**

మానవ జాతి పరిణామానికి, వికాసానికి అనాది, పునాది అరణ్య ప్రాంతమే. ఆ అటవీ ప్రాంతంలో నివశించిన ఆదిమ జాతులే నేటి మానవ జాతికి పూర్వీకులు. క్రమ పరిణామంతో, వికాసంతో ఆదిమ జాతులు నాగరిక జాతులై మనుగడ సాగిస్తుండటం చారిత్రక సత్యం. ప్రస్తుతం మనం చూస్తున్న వాస్తవం. నాగరికతను పొందిన మనిషి శాస్త్ర, సాంకేతిక, విద్య, వైద్య, వైజ్ఞానిక మొదలైన అనేక రంగాలలో నైపుణ్యం కనబరిచి, తన జీవితాన్ని అభివృద్ధి పథంలో సాగిస్తున్నాడు. సుఖవంతం చేసుకున్నాడు. అయితే ఆ అదృష్టాన్ని అవకాశాన్ని పొందని, పొందలేని, అనేక ఆదిమ జాతులు ప్రపంచంలో ఇంకా ఉన్నాయి. ఇందుకు భారత దేశం, ఆంధ్రప్రదేశ్ అతీతమైనవి ఏమీ కావు. భారతదేశంలోని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఇంకా నాగరికత వృద్ధి చెందని, అభివృద్ధికి నోచుకోని ఎన్నో ఆదిమ జాతులు, తెగలు అరణ్య ప్రాంతాలలో నివశిస్తున్నాయి. అటువంటి తెగలు ఆంధ్రప్రదేశ్‌లోని విశాఖ ఏజెన్సీ ప్రాంతంలో కూడా ఉన్నాయి. వాటిలో "కోదు" తెగ ఒకటి.

**ప్రస్తుత వ్యాసాంశం:-** నా యొక్క పి.హెచ్‌డి. పరిశోధనాంశం -"విశాఖ ఏజెన్సీ కోదు తెగ ప్రజలు-సంస్కృతి, సంప్రదాయాలు. ఈ కోదు ప్రజల సంస్కృతి, సంప్రదాయాలలో భాగమైన వారి యొక్క పండుగల ప్రాముఖ్యతను వివరించుటయే ప్రస్తుత వ్యాస ఉద్దేశ్యం.

'కోదు' గిరిజనుల పండుగలు - ప్రాముఖ్యత :-

విశాఖ ఏజెన్సీ కోదు గిరిజనుల పండుగలు అనేకం కలవు. వాటిలో కొన్నింటిని మాత్రమే వివరించటం జరిగింది. అవేవనగా

1. ఇటుకల పండుగ.
2. భీముడు దోషం.
3. అమ్మవారి దోషం.
4. నల్లి తినడం.
5. కొర్ర కొత్త.
6. జొల్ల పండుగ.
7. దానెం కొత్తలు.
8. సంకురాతిరి.
9. కుడువుల పండుగ.
10. హోళి.

**1. ఇటుకల పండుగ**

గిరిజనుల నెలల్లో మొదటిగా వచ్చే ఇటింగ్ నెలలో ఇటుకుల పండుగను కోదు ప్రజలు జరుపుకుంటారు. వ్యవసాయ పనులను ఈ పండుగ అనంతరం ప్రారంభిస్తారు. ఈ పండుగ హోళి పండుగను పోలి ఉంటుంది. హోళి పండగను ఒక్కరోజు మాత్రమే రంగులతో జరుపుకుంటే ఇటుకల పండుగను మాత్రం నెల రోజుల పాటు గిరిజనులు జరుపుకుంటారు. ఈ పండుగలో భాగంగా నెల రోజుల పాటు నీరును ఒకరిపై ఒకరు పోసుకుంటారు.

ఈ పండుగను సాధారణంగా గురువారం ప్రారంభిస్తారు. ఆ రోజున కోళ్ళు కోసి నాగలికి పూజ (ఆయుధ పూజ) చేస్తారు. మరుసటి రోజున (శుక్రవారం) పర్వతానికి వెళ్ళి పెద్ద వెదురు కర్ర లేదా అర్ల ఒర్లు (అడ్డాకుల తీగ)తో ఊయాలను కట్టి గ్రామంలోని మహిళలు, పిల్లలు ఎక్కువగా ఊగుతారు. ఇలా ఊగేటప్పుడు పండుగ సందర్భానికి గల పాటలను పాడుతారు. ఇది గిరిజనేతరులు జరుపుకునే అట్లతద్ది నాడు ఊయలను ఊగటం వలే ఉంటుంది.

ఈ పండుగ రోజులలో వచ్చే సంత రోజున గిరిజన సాంప్రదాయం ప్రకారం తాచేరును అడుగుతారు. తాచేరు అనగా సంతరోజున ఆ గ్రామానికి దగ్గరలో ఉన్న రహదారికి అడ్డంగా ఒక కర్రను పెట్టి మనుషులు వెళ్ళినా, వాహనాలు వెళ్ళినా ఆపి డబ్బులు గాని లేదా ఏదైనా వస్తువు గాని లేదా తినుబండారాలు అడుగుతారు. దీనిని మహిళలు మాత్రమే అడుగుతారు. ఇది నిర్బంధం కాదు. ఇది ఆచారం ప్రకారం సరదాగా అడిగే ఒక సంప్రదాయం మాత్రమే. ఇలా సేకరించిన డబ్బుతో అందరూ కలసి విందు చేసుకుంటారు.

ఈ ఉత్సవం జరిగిన తర్వాత వచ్చే మూడు రోజులు (సోమ, మంగళ, బుధ) లలో గ్రామంలోని పురుషులు అందరూ

వేట్కై అడవికి వెళతారు. వేటకు వెళ్ళిన పురుషులు ఏదో ఒక అడవి జంతువును (తినటకు వీలు పడేది) వేటాడి తీసుకురావల్సి ఉంటుంది. అలా తీసుకురాని పురుషులను మహిళలు ఎందుకు పనికి రాని వారిగా చూస్తూ ఎగతాళి చేస్తారు. వారికి స్నానానికి నీళ్ళు పెట్టేటప్పుడు కూడా మహిళలు ఏ విధంగా స్నానం చేస్తారో అదేవిధంగా స్నానాలకు ఏర్పాట్లను చేస్తారు. నీళ్ళతో పాటు పసుపు పెడతారు. ఎవరు చూడకుండా అడ్డంగా ఏదో ఒక దానిని కడతారు. ఈ పండుగ బాగా చేస్తే పంటలు బాగా పండుతాయని నమ్ముతారు.

**2. భీముడు దోషం**

ఈ పండుగను వ్యవసాయ పనులను ప్రారంభించటానికి ముందు వర్షం బాగా పడాలని బైసంగ్ (మే) నెలలో నిర్వహిస్తారు. ఈ పండుగలో మొదటిగా పూజను చేస్తారు. ఈ పూజ కోసం కొబ్బరికాయ, అరటిపళ్ళు, ఊదొత్తులు తదితర పూజ సామాగ్రితో పాటు నల్లని మేకను కూడా తీసుకొని పర్వతం దగ్గరకు తీసుకువెళతారు. అక్కడ పూజలు నిర్వహించి అక్కడ మేకను బలి ఇస్తారు.

**3. అమ్మవారి దోషం**

దీనినే అమ్మవారి పండుగగా కూడా పిలుస్తారు. దీనిని లండిజెట్ లేదా అషాడ్ (జూన్ లేదా జూలై) నెలలలో జరుపుకుంటారు. సాధారణంగా ఆది, సోమ, మంగళ వారాలు మూడు రోజులు ఈ పండుగను జరుపుతారు. ఈ పండుగ ప్రారంభంలో గ్రామస్థులందరూ, మరియు ఆ గ్రామ పూజారి (దేశరి) కలసి ఆ గ్రామంలోని ఒక బావి దగ్గరకు వెళతారు. ఆ బావి వద్ద దేశరి పూజలు నిర్వహిస్తారు. ఆ బావి నుండి కంచు చెంబుతో నీటిని తోడి దానిలో మూడు మామిడి ఆకులు, సంపంగి పూవులు వేసి మంత్రాలను జపిస్తారు. గ్రామంలోని అన్ని ఇళ్ళకు వెళ్ళి, ఆ ఇళ్ళల్లో ఆ నీటిని జల్లుతారు. ఆకుల దొప్పలలో (విస్తరకు ఉపయోగించే ఆకులను బుట్టవలె కుట్టినవి) ఈ నీటిని పోసి గ్రామస్తుందరి చేత తాగించటం జరుగుతుంది. ఈ దొప్పుల్లో నీరు త్రాగడం వలన జబ్బులు తగ్గుతాయని నమ్మకం. చివరి రోజున (మంగళవారం) ఒక రథాన్ని తయారుచేసి ప్రతి ఇంటికి ఊరేగింపుగా తీసుకువెళతారు. ఇలా తిప్పినప్పుడు ప్రతి ఇంట్లో వాళ్ళు వారి ఇంటిలోపల ఉన్న పాడైపోయిన చీపురు, బుట్ట, తదితర వస్తువులను రథంలో పడవేస్తారు. ఈ గ్రామంలో ఊరేగింపు పూర్తైన అనంతరం ఆ గ్రామ పొలిమేరలు దాటించి అవతల గ్రామం పొలిమేరల్లో వదిలిపెడతారు. ఈ పూజ వలన గ్రామంలో ఎటువంటి కష్టాలు ఉండవని, అమ్మవారు దీవెనలు ఉంటాయనేది వారి నమ్మకం.

**4. సట్టి తినడం**

ఈ పండుగ జూన్ నెలలో జరుగుతుంది. ఈ పండుగను పంట పొలాల్లోనే జరుపుకుంటారు. పొలములోనే వ్యవసాయ పనిముట్లను, పశువులను పూజించి, పొలాల్లోనే సట్టి తినడం జరుగుతుంది. కాబట్టి దీనికి సట్టి తినడం అనే పేరు పెట్టారు. ఈ పండుగ రోజున ఉదయాన్నే సాధారణంగా దుక్కికి వెళుతారు. వెళ్ళిన అనంతరం పశువులను శుభ్రం చేస్తారు. వారు కూడా స్నానం చేస్తారు. ఈ సందర్భంగా ఒక వంటకాన్ని తయారుచేస్తారు. ఈ వంటకాన్ని గిరిజన ప్రాంతంలో లభించే పిండి దుంపలు, ఈత దుంపలు, ఈత పురుగులు, కూరగాయలు, తదితరాలను కలిపి తయారు చేస్తారు. దీనితో పాటు గిరిజనులకు అధికంగా లభించే అంబలి (రాగి మాలు) ఉంటుంది. ఈ సంవత్సరం పంటలు బాగా పండాలని ఆ ఆహారపదార్థాలను మొదట పశువులకు తినిపిస్తారు. తర్వాత వారు కూడా తిని అందరూ ఇంటికి తిరిగి వస్తారు.

**5. కొర్ర కొత్త**

కోదు ప్రజల పండుగలలో అధిక ప్రాధాన్యత సంతరించుకున్న పండుగల్లో ఈ కొర్ర కొత్త పండగ ఒకటి. ఈ పండుగ బందపన్ నెలలో (ఆగష్టు)జరుగుతుంది. ఇది ప్రధానంగా రైతులకు పండిన కూరగాయలు తదితర పంటలను మొదటిసారిగా తీసుకువచ్చుటకు జరుపుకునే పండుగ. ఈ పండుగ జరిగిన అనంతరం మాత్రమే కొత్తగా పండిన పంటలను వాడతారు. ఈ పండుగకు ఊరులో గల చలాని (తలయారి)ప్రతి ఇంటికి వెళ్ళి కొద్దిగా బియ్యం, కొంత డబ్బులు సేకరిస్తాడు. ఈ బియ్యంతో కోడిని కొంటారు. మిగిలిన బియ్యంలో గుమ్మడి ఇగురు కలిపి గ్రామ పెద్ద కొత్తపిడత (చాలా చిన్న కుండ)తో బోనం వండుతారు. తర్వాత వారి గ్రామంలోని గ్రామ దేవతకు, సంకుదేవుడుకు, పోతురాజు దేవుళ్ళకు, కోడిని కోసి, కొబ్బరి కాయను కొట్టి పూజను చేస్తారు. బోనం పెడతారు. ఆ తర్వాత మాత్రమే వారు భోజనం చేస్తారు. అంతవరకు ఉపావాసంతో ఉంటారు.

**6.జోళ్ల పండుగ**

కోదు ప్రజల పండుగలలో జరిపే వ్యవసాయ పండుగలలో జోళ్ల పండుగ ఒకటి. జోళ్ల పండుగ ఉదయాన్నే

ప్రారంభమౌతుంది. ఆ రోజు వేకువజామునే పర్వతానికి వెళ్ళి జొళ్ల కొమ్మలు తీసుకువస్తారు. జొళ్ల కొమ్మలు అంటే ఒకే మొక్కల జాతికి చెందిన కొమ్మలు కాకుండా కొసిమి కొమ్మ, సీతమ్మ కర్ర, జిరుగు, బాపన కర్ర లాంటివి. అర్కాకులు కూడా తీసుకువస్తారు. గ్రామ చలాని ప్రతి ఇంటికి వెళ్ళి కొంత బియ్యాన్ని, కొంత డబ్బును సేకరిస్తారు. సేకరించిన డబ్బుతో కోడిని కొనడం జరుగుతుంది. గ్రామ పెద్ద పోతురాజు సంకుదేవుడుల వద్ద కోడిని కోసి కోడి రక్తాన్ని బియ్యంలో కలిపి పూజలు చేస్తారు. గ్రామంలోని ప్రతి ఇంటివారు ఈ బియ్యాన్ని తీసుకువెళ్ళి జొళ్ల కొమ్మల్లోని ప్రతి కొమ్మకు బియ్యాన్ని కడతారు. ఈ కొమ్మలను మరియు మిగిలిన కొమ్మల్లో కట్టిన భోజనాన్ని పొలాలకు తీసుకువెళ్ళి దానిని నైవేద్యంగా పెట్టి కొమ్మలను పొలాల్లో పాతుతారు. ఆ తర్వాత నైవేద్యాన్ని తిని ఇంటికి తిరిగి వస్తారు. పొలంలో ఒక దిష్టి బొమ్మను ఏర్పాటు చేస్తారు. ఈ పండుగ చేయటం వల్ల పొలంలోని పంటకు చీడ పురుగులు పట్టకుండా ఉంటాయని వారి నమ్మకం.

**7.దానెం కొత్తలు**

మెట్ట పంటలు పండిన తర్వాత ఇంటికి తీసుకురావడానికి జరుపుకునే పండుగ ఇది. ఈ పండుగను గురు లేదా శుక్రవారం జరుపుకుంటారు. దీనిలో కూడా మిగిలిన పండుగల వలె ప్రతి ఇంటి నుండి బియ్యం, డబ్బులు పోగుచేసి, బోనం వండి, గ్రామ దేవుళ్ళకు పెట్టడం జరుగుతుంది. కాకపోతే ఈ పండుగ సాయంత్రం వేళలో నిర్వహిస్తారు. కావున పూజ చేసే వ్యక్తి ఆ రోజు పూజ చేసే వరకు ఉపవాసంతో ఉంటాడు.

దీనినే సంక్రాంతి పండుగ అని కూడా అంటారు. సంక్రాంతి పండుగ గిరిజన ప్రాంతంలో జరిగే తీరు, పట్టణ, గ్రామీణ ప్రాంతలలో జరిగే తీరు పూర్తి భిన్నంగా వుంటుంది. పట్టణ, గ్రామీణ ప్రాంతంవలె పంచాంగం ప్రకారం కాకుండా ఈ పండుగను గ్రామంలోని దిశరి నిర్ణయించిన మూహూర్తం బట్టి ఒక్కో ప్రాంతంలో ఒక్కో సారి జరుగుతుంది. గిరిజనుల నెలలలో సంకురాతిరి నెల ఉండటం ఇక్కడ ప్రత్యేక విషయం. ఈ గిరిజనుల ప్రాంతంలో సంక్రాంతి పండుగ నెల రోజులకు పైగా సాగుతుంది.

ఈ పండుగను దిశరి కనీసం వారం రోజుల ముందుగా నిర్ణయిస్తారు. దీనిని గ్రామ ప్రజలకు చాటింపు ద్వారా తెలియచేస్తారు. ఈ పండుగను దాదాపుగా మంగళ, బుధవారల్లో చేస్తారు. మంగళవారం రోజున కోళ్ళను కోయడంతో ఈ పండుగ ప్రారంభం అవుతుంది. బుధవారం పులగం వండుతారు. వీటితో పాటు కుడుములను వండి, నాగల దుంపను, గుమ్మడి ముక్కలను ఉడకబెడతారు. ఆ రోజు ఉదయం అన్ని పశువుల కొమ్ములకు ఎర్రటి రంగును పూసి, వీపు భాగంలో నూనెను రాసి, పూజ చేసిన పులగాన్ని, దుంపలను, కుడుములను వాటికి కడతారు. వీటిని పిల్లలు తెంపుకొని తినవచ్చును.

ఈ పండుగలో మరొక ముఖ్యమైన సందర్భంగా "బుడియా దండటం" జరుగుతుంది. బుడియా దండటం అంటే ఇంటింటికి వెళ్ళి (జోగి మాదిరిగా) అడగడం జరుగుతుంది. ఇందులో పిల్లలు, పెద్దలు (పురుషులు మాత్రమే) పాల్గోవడం విశేషం. ఇటుకల పండుగ అప్పుడు మహిళలు మాత్రమే తాచేరు అడగటం, ఈ పండుగప్పుడు పురుషుల మాత్రమే బుడియా అడగటం ఒక ప్రత్యేకత. ఈ విధంగా వీరు సేకరించిన వాటితో ఒక విందు ఏర్పాటు చేసుకుంటారు. విందు అనంతరం గ్రామ చావడి వద్ద ప్రజలందరూ కూర్చొని, ఊర్లోని కష్ట, సుఖాలను మాట్లాడుకుంటారు. ఈ సందర్భంలోనే గ్రామానికి అవసరమగు గౌడు, చలాని (గ్రామ పెద్ద) లను ఏర్పాటుచేసుకుంటారు.

**సామాజిక ఉద్దేశం**

ప్రపంచంలోని అన్ని దేశాల కంటే విభిన్నమైన సంస్కృతి, సంప్రదాయాలు, ఆచారాలకు నిలయం మన భారతదేశం. ఈ సంస్కృతీ సంప్రదాయాలు, ఆచారాలు అన్ని కూడా ఇప్పటి నాగరికుడుగా పిలువబడే ఒకనాటి ఆదిమ మానవుడు నుండి సంక్రమించినవి అనుటలో అతిశయోక్తి లేదు. అయితే నేటి ప్రపంచంలో మారుతున్న పరిస్థితులతో పాటు ఏజెన్సీ ప్రాంతాలలో కూడా మార్పులు వస్తున్నాయి. ఇది స్వాగతించాల్సిన విషయమే. కాని ఎందులో మార్పులు కావాలి? అక్షరాస్యత, ఆర్థిక, సామాజిక, రాజకీయ పరిస్థితులలో గణనీయమైన అభివృద్ధి లేదా మార్పు రావాలి. దీనిని ప్రతి ఒక్కరు స్వాగతించాలి. ఎంతో ఔన్నత్యం కలిగిన మన సంస్కృతి సాంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు, పండుగలు పబ్బాలు పాటించి మన జాతి మనుగడను కాపాడాల్సిన బాధ్యత మనదే. కానీ ప్రస్తుత ప్రపంచీకరణ ప్రభావం ఏజెన్సీ ప్రాంతాలలోని సంస్కృతి, సంప్రదాయాలపై కూడా పడి ఏజెన్సీ ప్రాంత సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు తెలియని స్థితిలో ఉన్నాయి. ఇలా అయితే భావి తరాలు ఈ సంస్కృతీ, సాంప్రదాయాలను ఎంతవరకు ఆచరిస్తాయో సందేహమే. ఇదే జరిగితే నిజంగా బాధకరం. అయితే భావితరాల వారు ఈ ఆచారాలు పాటించకపోయినప్పటికి కనీసం వారి సంస్కృతి, సంప్రదాయాలు ఇలా ఉంటాయని తెలుసుకోవాలనేదే ఈ వ్యాసోద్దేశం.

## PARISOODHANA: NINNA, NEEDU, REEPU

**Editor: Dr. M. Sampath Kumar**



ది సెకండ్ వరల్డ్ ఆల్ఫాబెట్ ఒలంపిక్స్ ప్రశంసా పత్రం అందుకుంటూ...



మద్రాసు విశ్వవిద్యాలయం నుంచి డి.లిట్. పట్టా అందుకొంటున్నప్పుడు



పరిశోధక మిత్రులు పట్టాలు తీసుకొన్న సందర్భంగా

ఆచార్య మాడభూషి సంపత్ కుమార్ మద్రాసు విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖాధ్యక్షులుగా పనిచేస్తున్నారు. 1987లో 'ఎరుకలతమిళ భాషా బంధువాచకాలు- సామాజిక భాషాశాస్త్ర అధ్యయనం' అన్న అంశంపై మద్రాసు విశ్వవిద్యాలయంలో ఎం.ఫిల్. చేశారు. 1990లో 'ఎరుకలభాషకు వర్ణనాత్మక వ్యాకరణం' అన్న అంశంపై మదురై కామరాజ్ విశ్వవిద్యాలయంలో పిహెచ్.డి. చేశారు. 2015లో 'అత్యాధునిక కవితా దృక్పథాలు' అన్న అంశంపై మద్రాసు విశ్వవిద్యాలయంలో డి.లిట్.చేశారు. ఈయన దగ్గర మద్రాసు విశ్వవిద్యాలయంలో సుమారు 60మంది ఎం.ఫిల్., 20మంది పిహెచ్.డి. పట్టాకోసం పరిశోధన చేశారు. తెలుగు భాషా సాహిత్యాలపైన, సామాజికాంశా లపైన వందలాది వ్యాసాలు ప్రచురించారు. నూటయాభైకిపైగా జాతీయ అంతర్జాతీయ సదస్సుల్లో పరిశోధన పత్రాలు సమర్పించారు. 2012లో బ్యాంకాక్‌లో జరిగిన రెండవ ప్రపంచ లిపి సమ్మేళనంలో సమర్పించిన పత్రానికి తెలుగు లిపికి 'ఉత్తమ లిపి' పురస్కారం లభించింది. అనేక జాతీయ సదస్సులతోపాటు శ్రీశ్రీ, జాషువా, అన్నమయ్య, శ్రీకృష్ణదేవరాయలు, గురజాడ, సి.పి.బ్రౌన్ మొదలయిన వారిపై అంతర్జాతీయ సదస్సులు నిర్వహించారు. జూలై 2015లో నిర్వహించిన 24గంటల కవి సమ్మేళనాన్ని తెలుగు బుక్ ఆఫ్ రికార్డ్సువారు ప్రపంచ రికార్డుగా గుర్తించారు. ఈయన రాసిన 'మద్రాసులో తెలుగు పరిశోధన, ప్రచురణ' అన్న పుస్తకాన్ని తెలుగు అకాడెమీ ప్రచురించింది. సింగపూర్, మలేషియా, థాయ్‌ల్యాండ్ మొదలయిన దేశాల్లో అంతర్జాతీయ సదస్సుల్లో పాల్గొని తెలుగు భాషకు సంబంధించిన విషయాలను ప్రపంచానికి తెలియజేశారు.

ISBN No.: 978-93-81992-32-6